చెల్లెల్దమ్ముఁడుఁ బ్రబ్బుటుబ్బునవడిం

జేరంగ నేతెంచి యే

ముల్లాసంబున నుంటఁగాంచి మృదువా

గోద్వేలతం బద్యజా

లోల్లోలంబులఁ దేల్ప వేఁడికొనఁగా

నుంకించి నాఁడాదిగా

నాల్లాఱింటను జెప్పికొంటిమయ కం

దాల్ నేర్చు చాదంబునన్.

# బాలశతకము.



కారుణ్యోద్వేలున్
భీకర పాపవనదహనవిస్ఫురదనలున్
ప్రాకటమునిజనపాలున్
లోకైకేశుఁ దలఁపు మదిలోపల బాలా! ౧

మొదలున్నదుమయుఁ దుదియును
నొదవని నిర్నిద్రశక్తియుతతేజంబున్
వదలక యనూనభక్తియు
నెదగదురం దలఁపుమయ్య యెపుడున్ బాలా! ౨

ఘనదురిత విదళనాసిన్
మునిజనహృదయాబ్జధర్మపురవరవాసున్
వినుతనిగమసంస్తుత్యున్
గొనియాడుమ హృదయమందకుటిలత బాలా! ౩

భక్తస్తోమక్షేమున్
ముక్తవిశిఖదళితపరసముజ్జ్వలధామున్
శుక్తహృదయాభిరామున్
దిక్తటసంకీర్ణయశు మదిఁదలఁపు బాలా! ౪

# బా ల శ త క ము.

ఇనశశి బింబాక్షాంచిత
ఘనదిన నిశిచక్రయుక్త కాలశకటమం
దుననిఖిలంబిడి త్రోఁ ద్రో
ల్కొని పోవు ననంత తేజుఁ గొలువుము బాలా! ౫

తమవిచ్ఛేదకతరణిన్
విమలాత్మీయఘనభక్తనియమితభరణున్
నమితభవ జలధితరణిన్
మమతను దిగనాడివేఁడుమన్నా బాలా! ౬

మాయాకల్పితలోకు న
మేయావ్యాజాత్మీయఘనమేధ్యకృపాధా
రేయుఁ భావాతీతుఁ
సాయుజ్యముపొంద వేఁడఁజనురా బాలా! ౭

త్రైలోక్యభద్రదాయకు
నాలేఖ్యాతీతగుణగణానంతవిభుఁ
గాలాభీలాసిధరుని
నాలోకావనుని వేఁడు మనయము బాలా! ౮

మునిహృదయజలజభృంగున్
ఘనకరుణావృష్టికర ఘనఘనుననఘాత్మున్
జణాభక్తిపాశబద్ధున్
వినుతింపుము సంతతంబు ప్రీతిం బాలా! ౯

# బాల శతకము.

నిరుపముఁ బ్రాణ్యాధారున్
నిరామయుఁ బరాత్పరు ఘను నిత్యాచ్యుతునిం
ధరణీబాహ్యాంతరతల
పరిసంకీర్ణుం దలఁపుమభక్తిం బాలా! ౧౦

జ్ఞానానంద విభాసున్
దీనజనావను మునీంద్రనికరత్రాణున్
సూనృతనిష్ఠాపరునిన్
మానసవీథిఁ దలపోయుమన్నా బాలా! ౧౧

విశ్వసృజన కారకునిన్
విశ్వనిరంతరభరణుని విశ్వస్తుత్యున్
విశ్వేశు విశ్వలయునున్
విశ్వాత్మకు సంతతంబు వేఁడుము బాలా! ౧౨

దినకరసహస్రతేజుఁ
ఘనచిన్మయరూపభాసుఁ గారుణ్యమయున్
వినుతనిగమసంపూజ్యుని
వినయము గొనియాడుమయ్య యాత్మన్ బాలా! ౧౩

అమరఁగ ధర రంగముగా
సమయము తెరగా సమస్తజంతువ్రాత
మ్ము మఱియు నటకులుగా నా
ట్యము జరిపెడువానిగొల్వుమన్నా బాలా! ౧౪

భవబంధముక్తిదాయకుఁ
గువలయ గురుతరభరధరుఁ గుజనకుమారున్
సవనపరి రక్షణపరుని
నవిరతభక్తింగొలువుమ యనయము బాలా! ౧౫

తూరుపుఁగొండం గనుపడు
తోరపుఁదేజాని విధమున దుఱఁగలిగొనఁగాఁ
దోరపుఁజలతనమొనర్పఁగ
ఘోరశపథమిప్పుడీవు గొనుమా బాలా! ౧౬

ఆపోకకలిమితోడుత
నేపారెడి హృదయకంజమెసఁగెడు రాజ్యం
బైప్రాపంచికసౌఖ్యము
లేపాటివి దానిముందు నెన్నఁగ బాలా! ౧౭

ఉన్నతపుఁ బదవులందున
నున్నట్టిఁడులకె గలుగును చ్యుతిభీతిమతిన్
ఉన్నత తరుశిఖరంబున
నున్నట్టియతఁడె పడువెఱపొందును బాలా! ౧౮

ఉరుధరణీశత్వంబును
బరిపూర్ణాక్షయధననిధి పరువము సొగసున్
ధరణీజైత్రాపీకము
దొరకిన నేమాయెఁదృప్తిఁ దొఱఁగిన బాలా! ౧౯

కలుములు గలిగియు ఘనముగ,
వెలితిగ గణియించువాఁడు బీదయె సుమ్మీ
కొలఁదియుఁ గలిగియు మనమున
నలయనివాఁడు కమధనికుఁ డారయ బాలా ! ౧౦

సదయుండై తానిచ్చిన
నెదిరియొసంగును నిజముగ నేలాకొంక
న్మదిలో ముంజేయాడినఁ
గద మోచేయాడుటలును గలుగుం బాలా ! ౧౧

ఒకపళ్లెరానఁ గుడుచుచు
నొకపడియ జలంబుగ్రోలి యొకపట్టునయుం
డె కనులు మోడ్చి గమనమున
నొకటైయుండుటను జాతి యొప్పుర బాలా! ౧౨

కలనాఁడె కలరుబంధులు
కలనాఁడే కలరు చెలులగణముల్ హితులున్
గలనాఁడె కలవు సుఖములు
కలనాఁడే సుమ్మియన్ని కలుగుట బాలా! ౧౩

నగరాదు నాథుతోడుత
దిగరాదు కలహములందుఁ దిరముగ నెపుడున్
వగవంగరాదు లేమికి
దిగనాఁడగరాదు కృప మదినెపుడు బాలా ! ౧౪

# బా ల శ త క ము.

ఆలింపుము బుధసూక్తులఁ
బాలింపుము శరణువేఁడు వారలనెపుడున్
దూలింపుము గోపంబును
జాలింపుము పరుషభాష సరగున బాలా ! ౧౭

ఈయకుసుమిమ్మా యప్పుల
తీయకుసుమిమ్మాయరువులఁ దీపులచేతన్
కోయకుసుమిమ్మా పిందెల
చేయకుసుమిమ్మా యెపుడును జెడుగుల, బాలా ! ౧౮

ఎక్కకుమా వాహనముల
చిక్కకుమా రోవెలంది చిక్కమునందున్
నిక్కకుమా పెద్దలకడ
మ్రొక్కకుమా ప్రతిమలకును మూర్ఖత బాలా ! ౧౯

పరుసిరియొసకముగన్నన్
గరమ్ముగన్నీరువిడచు ఘులుడున్ ప్రవేఁగు
న్నిరతము శిఖలేని సెగల
నెఱుంగక సుఖనికరమ్ము నెప్పుడు బాలా ! ౨౦

పూవులఁ గూడిననారకుఁ
దావులుగలిగెడియనువున ధన్యాత్ములతో
సావాసముగల తులువం
దావాసముచేయుగుణము లరుదుగ బాలా ! ౨౧

ఈసును, జుగుప్స, నిస్సం
తోషము, కోపంబు, శంక, తొందర, మదిలో
వాసముచేసినచో సం
తోసము కుండేటికొమ్ము దుఱఁగలి బాలా! ౩౦

ముడువకు పరుమొల్లంబుల
నడువకు నొవ్వ జననీజనకులమనంబుల్
తడవకు నితరుల దోసఁగుల
కడవకు పెద్దల పలుకులఁ గలనేన్బాలా ! ౩౧

ఎఱుఁగుమ పెద్దలకెల్లన్
ఎఱుఁగుమ విద్యలఁ దగవును నెల్లరు వొగడన్
దొఱఁగుమ దురితౌఘంబులఁ
బఱఁగుమ యానౌననంగఁ బల్వురు బాలా ! ౩౨

చూపోపమి, యుమ్మదలఁగ
వాపోకయు, జతనముసెడఁ బనివిడచుటయున్
గోపము ముక్కుననుంటయుఁ
గాపురుషగుణమ్ములంద్రు, గాదే బాలా ! ౩౩

సిగబంతి యాట యొండెను,
మొగమైనంజూపకటవి మొఱఁగుట యొండేన్
దగపూరుషునకుఁ గుసుమం
బుగైవడి మజొండొలయదు పొలుపుగ బాలా! ౩౪

అనఘుఁడు హీనుని గూడిన
ఘనముగ మానము దొఱఁగుట గల్గును నెట్ల
న్న నినుము గూడిన బావకుఁ
డనయఁడె ముద్గరపుఁబెట్టులెంతయు బాలా ! ౩౫

తోడరి పరుల సాయంబును
బడసి యిడుముసంద్రముగడవందలపెల్లన్
వడికుక్కతోఁకఁబట్టుక
కడలిం గడవఁగఁ గడఁగుట గాదే బాలా ! ౩౬

పోటుకు దిగకుము దిగినం
బాటవము నెఱపుచుఁ బోరుమాజంకకలో
ఱోటఁదలఁదూర్చిరోఁకటి
పోటునకు భయంపడంగఁబోవున బాలా ! ౩౭

గురునకుమాతకునాఁటికి
గరుణానిధిమగ్నజననికరగిరిధాత్రీ
వరకుంజరునకు నెపుడున్
గొఱగాని యతనిమనుగడ గొడ్డేర్బాలా ! ౩౮

కొఱగాములలోపల దన
దరిఁజేరక దొఱఁగుదురు హితాదులువేగం
జెఱువెండిన వేళలలో
సురఁగవె జలచరములెల్ల సారిదిని బాలా ! ౩౯

బా ల శ త క ము.

దుందుడుకుఁ బనులువచ్చినఁ
కొందఱయినను దెగకున్నఁ గుదురునె కార్యా
లందఱు నందల మెక్కిన
గ్రిందను నెవ్వాఁడు మోయుఁగేరుచు బాలా! ౪౦

ఏలాగునఁ దామెలఁగిన
నాలాగునఁబరుఁడుమె లఁగు నదియెట్లన్నన్
తూలను బువ్వేదు వారలఁ
బూలను బువ్వుదురెయెందుఁ బొల్పుగ బాలా! ౪౧

ఏలాగున మనముండిన
నాలాగున గానుపించు నఖిలంబరయ
న్నేలాటి జోడుపెట్టిన
నాలాగు నఖిలము దోఁచునట్టుల బాలా! ౪౨

తాలిమిగల వారలకున్
జాలమి పెట్టుదురయినను సజ్జనులెల్లం
దాలుతురా పెను దోడవునె
లాలిత్యం బెసఁగ ననవరతము న్బాలా! ౪౩

కరఁగుటచే లోహంబులు
గురుకష్టంబులు వోరయుట కుజనవ్రాతల్
దరిసెనమున సన్మార్గులు
గరిమన్నేకంబగుదురు గాదే బాలా! ౪౪

గరువముచేఁ జెలికారము
నిరపన దాల్చుటను గార్యనికురంబధికా
దరమున్న అపుటఁ గుఱ్ఱఁడు
నరయమిసేద్యము చెడుగదరా వడి బాలా! ౪౫

కట్టెదుటి పట్టుదలఁగుచు
నట్టిటుసూడక నరేశు నవలోకముగ
న్వట్టుక యుండంగావలెఁ
గట్టడితో ఱేనికొల్వుకాండ్రకు బాలా! ౪౬

తనకత యుడుపులు దెలుపును
ఘనునిచరిత్రమ్ము చేయుకార్యాలెస్పష్టా
ఫణినింభోగము దెల్పును
జెనటెనిదుర్గుణగణము లె చెప్పుం బాలా! ౪౭

విప్పకు పరులకు హృదయము
తప్పిది యొప్పితనియనక తమమదులుపరుల్
సెప్పెదుసమయములందున
నొప్పుగనూఁ గొనుటయొంతయు హితవు బాలా! ౪౮

మాతాపితలుం గురువులు
మిత్రులను నలువురార నీకుమేల్సేయుంగాఁ
జాతురు సుమ్మిదితథ్యము
లాతులకేటికి హితంబులంగన బాలా! ౪౯

దివిభువిభాగములెల్లన్
నివిడిశరత్కాలపూర్ణ నిశికరరుచులం
దెవడెడి కీర్తిద్యుతిగ
లవాఁడు పురుషవృషభుండరయఁగం బాలా! ౯౦

గతిగలుగని యాతనికిన్
మతిగలుగని పంకజాక్షి మతిపెండ్లామా
నతిచిత్రముగానంచున్
మతిమంతులు నుడువుచుంద్రు మహినిం బాలా! ౯౧

తనప్రాపుఁగోరివచ్చిన
ఘనభీకర శత్రునైన గారుణ్యముతో
డ నభయమొసంగిగాచును
వినుతింపగ జనులు ధర్మవిదురుఁడు బాలా! ౯౨

వేరమిమనమున లేమియు
నోరిమి హృదయముననుంటయును నిరతంబున్
నేరములెన్నక గోనములె
యేరికొనుట సజ్జనులకు నెసఁగుంబాలా! ౯౩

వలపులసిరితారుణ్యా
దులునీళుల మూటలవుటతోరావునుమీ
యులధర్మము చనుదెంచును
దలఁపంగాఁ బోవువేళ తనతో బాలా! ౯౪

ఒరులకుఁ బెట్టక గుడువక
కరమ్ముసిరులంగడించు ఘనుఁడనయంబున్
బరులకు నూఱక మోపుల
నిరవుకుఁ జేర్చెడియతండె నిజముగ బాలా! ౧౫

హీరమ్యుందు జడుండై
సారబలవిభవయుతుండు చనుగర్వితుఁడై
శూరుఁడు కరుణాహీనుఁడు
క్రూరహృదయమతమునందుఁ గుంభిం బాలా! ౧౬

పరుసపుఁబలుకుల గరువము
దొఱంగి సత్యవ్రతంబు దొలఁగక చెడుగుల్
నిరసించుచు ధర్మమునకు
వెఱచుచు సజ్జననికరము వెలయుర బాలా! ౧౭

అరయ దానముచేయని
భూరిధనాధికునికంటెఁ బొమ్మనకెపుడున్
గారుణ్యముతో నొసఁగు ను
దారగుణాఢ్యుండె మేలు ధరణిం బాలా! ౧౮

ఆపదలందున ధైర్యము
భూప సభలఁ జతురవాక్య పుష్కలముం బా
హాపటుల కీర్తి రణంబున
నేహారము సజ్జనులకు నింపుగ బాలా! ౧౯

ఘనుఁడైనను భూమీశుఁడు
దనకడఁ గుత్సితులఁజేర్చ త్యాజ్యుండౌ దా
రుణపన్నగసంయుతచం
దన ధరణీజము విడచువిధంబున బాలా! ౬౦

కొండలనెల్లం ద్రుటిలోఁ
బిండిగఁగొట్టంగవచ్చుఁ బెన్నురగంబున్
దండగఁ దాల్పనగు మొఱకు
గండనిమన మెఱుఁగరాదుగదరా బాలా! ౬౧

కలిమికలవాఁడె యనఘుఁడు
కలిమింగలవాఁడె ఘనుఁడు గౌరవయుతుఁడున్
గలిమిగలవాఁడె పూజ్యుఁడు
కలమింగలవాఁడె సుమతిగదరా బాలా! ౬౨

చనినారలు భూమీశులు
చనినారలు పూర్వసమయ జనవారంబుల్
చనినవి రాజ్యాల్ పురముల్
చననున్నవి కనఁబడునవి సరగున బాలా! ౬౩

చనుకాలము దాపించిన
ఘనువాక్యము లారుదీప గంధమ్మునభో
మణియగు నరుంధతినెపుడు
వినండు మూర్కొనఁడు కనఁడు విధిగం బాలా! ౬౪

పాత్రతయారసి దానము
గోత్రంబు కరంబెఱింగి కోమలి మఱియున్
క్షేత్రంబారసి పదవులు
భూతలనాథునకొసఁగుటొసంగును బాలా ! ౬

సానలఁదేఱుట రతనము
దానము నిరతము నెఱపుట దాతయును సర
ద్దానస్రవంతి మదకరి
క్షీణతనొందియు గడింత్రు కీర్తిం బాలా ! ౬

బంతివిధంబున ఘనమతి
మంతుఁడు పతనంబునంది మఱి పెంపొందున్
వింతగఁబడి మఱిలేవన
లంతిజడుం డినుపగుండు రహినిం బాలా ! ౬

మానుచుదోషములెల్లన్
బూనిక హెచ్చించును ఘనపుణ్యమునిచ్చున్
సానలఁదేఱిన మణినిం
గానొనరించును మనుజుని జ్ఞానము బాలా ! ౬

కోరక హితమొనరింతురు
ధారాధరశీతలాంశ తరణులఁబోలెన్
గారాకూరము లందిన
ధీరమతులు లోకమునకు దీప్తిం బాలా ! ౬

# బాలశతకము.

విఱిఁగిన వృక్షము మొలచును
నెఱకళదొఱఁగు శశిమెసఁగు నెఱికళతోడన్
మఱికొంత తడవుచనినం
చెఱఁగిఘనులు చన్నదాని కేడ్వరు బాలా! ౨౦

ఒసఁగినకొలదిని యొసఁగును
దొసఁగులదైన్యంబునెల్లఁ దొలఁచును ధృతిలో
నసమయశంబును గూర్చును
పొసఁగంగా విద్యనొండు పోలునె బాలా! ౨౧

జననము దొట్టియు సీకొద
విన శ్రమ దమయదిగనెంచి ప్రేమముతోడం
బెనిచిన తలిదండ్రుల కం
టెను దేవులువేఱెగలరె సీకుం బాలా! ౨౨

వినయము పెద్దలయెడలన్
ఘననిశితపుఁ జూడ్కి శత్రుకాండము లెడలన్
వినుతకరుణ బీదలయెడ
ఘనులకు నెవ్వరునొడివిరొగదరా బాలా! ౨౩

విద్యయె సిరియున్ సత్వము
విద్యయె రూపము గురుండు ప్రియమిత్త్రుండున్
విద్యయె విశిష్టదైవము
విద్యకు సరియొండు లేదు వెలయఁగ బాలా! ౨౪

మతిచెడి తిరిగెడివానిని
అతిదైన్యముదోఁపవేఁడు నల్పుని నభ్యా
గతు శరణార్థుని జంపెడి
మతిహీనున కిహపరము లమరునే బాలా! ౨౫

హితసేవకులు దొలంగిన
సతీసుతులు నార్యబంధు సంతానంబుల్
వెతలందఁగఁ దిట్టిన నీ
తితలందుసుమీ యెప్పుడును ధీరుఁడు బాలా! ౨౬

పలుబాసల సేఁతలు దో
సిలియును సతమేఁడికోళ్లు సిగ్గు విడుమరల్
కలుషవచనములు కాపురు
షులగు గుణములనుచు వచించుసూక్తులు బాలా! ౨

అలివిన యంతన యలువక
పలికిన బరుసములు మాఱువలుకక బన్నం
బులు వడిమిన్నక యుందురు
సలలితరీతిన్ ఘనమతిసంతతి బాలా! ౨

ఘనసంసారార్ణవమున
మనమును జిక్కంగఁబట్టి మనుగడకలము
న్ననువున గష్టావర్తం
బున బడగా నీక నడపుపొలుపుగ బాలా! ౨

## బా ల శ త క ము.

ఇడుమలు దొడరిన [illegible]యంతన
దడబడక మనంబునొక్క తరియంధైర్యన్
వడకంగానీక నిలిపి
కడవంగడఁగుం బురుషుఁడు గదరాబాలా! ౮౦

సత్యంబొసఁగును గీర్తిని
సత్యంబొసఁగును నిరతము సకలార్థంబుల్
సత్యంబొసఁగును సద్గతి
సత్యంబునకు ధరనొండు సాటియె బాలా! ౮౧

తాలిమిగలిగిన వారలు
లోలత్వ విడనాడువారు లోభవిహీనుల్
శీలసమేతులు తమ భూ
పాలకులకు గూర్చువారు పరగంబాలా! ౮౨

సమసంపద రాజితులకు
సమశీల చరితయుతులకు సమతేజులకున్
దమయంతలవారికె నె
య్యము వియ్యము కయ్యము ధర నలరుంబాలా! ౮౩

విను లోభమరయ ననిలము
ననువున వడిఁజాఁగఁఱగొను నాశ్రితవితతిన్
గనుక మనీషావంతులు
ననయము దానిని దొఱఁగుదురన్నా బాలా! ౮౪

## బా ల శ త క ము.

విడువకు శరణాగతులన్
గుడువకు హితబంధుబాల గురువులవెలిగా
నడలకు మాపదలడరిన
మిడకకు సిరియబ్బ జనులుమెచ్చగ బాలా! ౮౫

కుడిచేయి చేయుదానము
బడిచేతైనను నెఱుఁగని పగిదుండవలెన్
దొడరిన రోగంబులు వె
ల్లడిచేయంగవలెసుమ్మి రయమున బాలా! ౮౬

ఆర్జింపుము కీర్త్యర్థము
నిర్జింపుము భీకరరిపు నికరము నెపుడున్.
వర్జింపుము దుర్గుణములఁ
దర్జింపుము చెలినిదగవు దలఁగిన బాలా! ౮౭

కాలభుజంగమ దాకొను
వేళల నానామణిగణవిభ్రాజితభూ
పాలకవర్యమకుటమును
దూలకమనఁగాఁగలుగునె తుఱఁగలి బాలా! ౮౮

విటునకు నేకసతీత్వము
పటుపాతివ్రత్యనియతి పాలననటికు
ద్భటరణము సేఁతపిఱికికి
ఘటియించుట ప్రాణకుట్టకంబౌ బాలా! ౮౯

శిరమునకున్నమ్రత్వము
కరమునకుం బరహితకరకార్యము సేఁతల్
చరణమునకు జాతరలుఁ
వరకృప యెదకుఁ దొడవులయి వఱలుం బాలా! ౯౦
కలిమి బలుములు గలుగువా
రలతో డన్ననవరతమలఁతి చేఁజేతం
గలహంబు దెచ్చికొనుటల్
దలఁగొఱవిం గోకికొనుట తథ్యము బాలా! ౯౧
పాటెఱుఁగని దొరకొలువుఁ
గాటపు వలపేగలుగని కాంతామణితో
గూటము పాములతోఁ జెల
గాటమ్మనుచు న్మది నెఱుఁగందగు బాలా! ౯౨
ఎచ్చట ధర్మంబుండిన
నచ్చట జయలక్ష్మియుండు నదియెట్లనఁగా
నెచ్చోటం బొగయుండిన
నచ్చోటం బావకుండు నలరఁడె బాలా! ౯౩
సతికిం బ్రాణము మానము
పతికిం బ్రాణంబు వీరభటవారంబుల్
గృతికిం బ్రాణంబు గుణము
ల, తనువునకు శోణితంబు ప్రాణము బాలా! ౯౪
క్షమగలిగిన శౌర్యంబును
విమలప్రేమముగలిగిన విటతనమ్ముఁ జా

## బా ల శ త క ము.

గవుఁగూడిన విత్తంబును
నమరంగాఁబోవు సుమ్మియరసిన బాలా! ౯౫

పొలయించును దోసంబుల
వెలయించుననన్యదివ్యవిజ్ఞానంబుల్
కలిగించును కీర్తిద్యుతి
తలగించును మమతమైత్రి తప్పక బాలా! ౯౬

రాకన్మాన వవస్థలు
పోకన్మానవు తనువులు బుడగలవగిదిన్
దూకన్మానవసుఖములు
కాకన్మానవు ఫలించు కార్యాల్ బాలా! ౯౭

పరిజనములయందున్నృప
గురువులయందోర్పు తాల్పు కోవిదులందున్
గరువమనుకూలతహితని
కరమున సుజనులకు నేరుగఁజపిరో బాలా! ౯౮

ఏకస్మైనన్ సంఘ
మ్మేకార్యంబైన నిర్వహించునెటని య
న్నోకుమ యెద్దులుబండియు
నేకంబగు నెడ్లఁ గొండ కేఁగవె బాలా! ౯౯

ఎవ్వఁడు తత్త్వవిదుండై
దవ్వులనుండునొ స్పృహాలకుఁ దగుమెలకువతో
నవ్విభుఁడిహాపరంబుల
నవ్వారిగ భద్రములను నందుం బాలా! ౧౦౦